# భుజం భుజం కలిపి

( జనం పాటలు )



రచన:

ఎన్. కె. విశ్వ

ప్రచురణ:

జనహిత సాహిత్య సమితి, కరీంనగర్

ఆగస్టు 1982 — ప్రతులు 1000



మూల్యం: 3-00

ముద్రణ: శ్రీరామా ప్రింటింగ్ వర్క్స్, కరీంనగర్.

# కృతజ్ఞతలు

కొత్తపల్లి రవిబాబు, ప్రధాన సంపాదకులు- ప్రజా సాహితి, నిఖిలేశ్వర్, మాజీ వర్కింగ్ ఎడిటర్- ప్రజా సాహితి, వాసిరెడ్డి నవీన్, వర్కింగ్ ఎడిటర్- ప్రజా సాహితి, మలయశ్రీ, సత్యార్థి- ఎడిటర్, బి. వేంకటరామారావు, సారస్వత జ్యోతి సంపాదకులు, సమతారావు, ఉపాధ్యాయ సంపాదకులు— వీరంతా నా రచనలను ప్రోత్సహించి తమ పత్రికలలో ప్రచురించినందుకు నా హార్దికాభి వందనములు.

రచనలను ఒకపైపు పూర్తిచేసినా, వాటిని వెలుగులోనికి తీసుక రావడములోని దుస్థితి రచయితలకు వుండనే వున్నది. దానికిగాను ప్రజల సహకారము, చాల అవసరమై యున్నది.

నా రచనలను చూచి ముద్రణకు సహకరించిన మిత్రులు— వి. పర్వతాలు (వకీలు), పి. కొండల్‌రావు (సర్పంచు, పాతగూడూరు), పి. నారాయణరావు, పి. హన్మంతరావు, పి. భూమారావు, ఎస్. గోపాల్‌రావు, ఎస్. హన్మంతరావు, డి. లింగారెడ్డి, ఎం. మల్లారి, మరియు ఎస్. ప్రభాకరరావు, కె. రాంరెడ్డి (సూరావరం) C. P. S. ధర్మారం ఉపాధ్యాయ బృందమునకు, H. M. U. P. S. పాత గూడూరు, ఎం, రాజిరెడ్డి. పి. పెంటయ్య, కె. అగారెడ్డి, ఎస్. మల్లారెడ్డి, బి. సుదర్శన్ రెడ్డి, బి. కేశవరెడ్డి ఇంకా ఉదుతాభక్తిగా సహకరించిన తదితర మిత్రులందరికి నా ధన్యవాదములు.

పుస్తకమును చక్కగా ముద్రించిన శ్రీరామా ప్రెస్ యజమాని మధుసూదన్‌గారికి నా హార్దికాభివందనములు.

# అంకితం!



అమరజీవి,
ఠాకూర్
శ్యాంసుందర్ సింగ్
పెద్దపల్లి గారికి-
(తెలంగాణ పోరాట వీరగాథ)
— కోలాటం పాట —

ఠాకూరొచ్చె ఠాకూరొచ్చె ఠాకూరొచ్చెనమ్మా
ఠాకూర్ శ్యామసుందర సింగొచ్చెనమ్మా

ఎండకాలపు సెలవుల్లో- విద్యార్థులను కూడదీసి
రహస్యంగ ట్రైనింగిచ్చి- రణరంగంలో దూకేనమ్మా॥

పల్లె పల్లె లన్ని దిరిగి- కూలీ రైతుల కూడగట్టి
వెట్టిచాకిరి నెగురగొట్టి- గట్టి పోరు సల్పెనమ్మా ఠా॥

భూస్వాముల గుండెల్లో బాకై- భూములన్నీ పంచిపెట్టి
అమృతలాల్‌కు కుడిభుజమై- అభిమన్యుండై వెలిసెనమ్మా॥

సేవేజ్ గన్ చేతబట్టి- మిల్ట్రి జీపుల కూలగొట్టి
తెలంగాణ పోరాటాన్ని- ఘనంగ ముందుకు నడిపేనమ్మా॥

గుట్టలచుట్టూ మిల్ట్రివాళ్ళు- మేరావేసిన రోజుల్లో
ఆకూ, అలములుతింటూ శత్రుల మాటుగాసి నెదిరించెనమ్మా

ఎత్తుకు పై ఎత్తువేసి- ఎర్రి జండా ఎత్తీ పట్టీ
విముక్తి చేసి ప్రాంతాలన్ని- వీరవిహారం చేసేనమ్మా॥
అమరుడా శ్యాంసుందర్ సింగు- అందుకో మా జోహార్లానూ
మీ ఆశపథం ఫలియించుటకొరకు మేమంతా అంకితమౌతాం॥

— రచయిత.

# జనం ఊపిరితో

ఈనాటి శ్రామిక జనం ఊపిరిని పసిగట్టిన ప్రతి కవి "భుజం భుజం కలిపి" ఆ పీడిత జనవిముక్తికోసం గొంతెత్తి ప్రజల మధ్య నిలుస్తున్నాడు.

ప్రజలను సులువుగా ఆకట్టుకునే పాటను ప్రజాపరం చేసేప్రయత్నాలుకొనసాగుతూనేవున్నాయి. పెత్తందారివర్గం బలవంతంగా సామాన్యుల బాధల పల్లవిని బూతు పదాల మురికికాల్వల్లోకి మళ్ళించినా, ఆ సామాన్యుల వర్గ స్వభావాన్ని పోరాట మార్గం పట్టించే ఉద్యమంలో తెలుగునాడులో నలుమూలలా సమర గీతాలు పెల్లుబుకుతూనే వున్నాయి.

గ్రామాల్లో పుట్టి పెరిగి, భూమి పుత్రులైన సామాన్య రైతుల కష్టసుఖాలను స్వయంగా చూసి అనుభవించి, కలం ఎత్తిన ఎస్. కొమరయ్య పిళ్ళేగారు తమ పాటలకు జనం ఊపిరితోనే ప్రాణం పోశారు.

విప్లవ కవిత్వంకూడా కేవలం ఆ విప్లవ కవులు మాత్రమే చదువుకోడానికి తప్ప ఎవ్వరిమీదా వాటి ప్రభావం కనిపించడం లేదనే 'కొందరి' అభిప్రాయాన్ని అపవాదుగానే నిరూపించి ఈ పాటలను వినిపిస్తున్నారు మిత్రులు పిళ్ళేగారు.

వోట్ల పీర్ల పండుగలో ఊరేగుతున్న నాయకులకు డబ్బు కులం బలంతో సామాన్యుడి గొంతుకు మరింతగా

బిగిస్తున్న వ్యాఘ్రానాల ఉరిత్రాడును తెగ్గొట్టే బలం ఆ సామాన్యుడి చేతిలో వుంది. అయితే ఆ చెయ్యికి గుండె బలాన్ని పెంచి, నీరుకార్చే "రివిజనిజాన్ని" వోడించి కర్తవ్యాన్ని నిర్దేశించాలి.

ఆ కర్తవ్యాన్ని, జనపక్షంలో సాగే పోరాట మార్గాన్ని అలంబనం చేసుకొని పిళ్ళైగారు మరింత దగ్గరగా ఈ పాటల ద్వారా శ్రామిక జనం గుండెలదాకా వెడుతున్నారు.

"సంఘ బలం లేకుంటే
చించి చెండాడుతారు
గ్రామ పేద లందర్ని చిన్నోడ
ఐక్యపర్చు సంఘంలోన—"

ఒంటెద్దు పోకడలో కేవలం వ్యక్తిగత హింసావాద సాహసిక చర్య ప్రజా పోరాటాలను వెనక్కి నెడుతుందనే యధార్థాన్ని సంఘబలంలో ఈ కవి మనకు చూపుతున్నారు.

శ్రామిక జగత్తుకోసం నిజమైన స్వేచ్ఛావాయువులు సాధించే నిమిత్తం తన కలాన్ని, గళాన్ని అంకితంచేసిన కొమరయ్య పిళ్ళైగారి ఈ ప్రజా సమస్యల నిత్యజీవన సంగ్రామంలోని నిజాయితీ పాటలతో నా గళాన్ని కూడా జతచేస్తూ-

46, విద్యానగర్ కాలని,
హైదరాబాదు - 500044
12 జనవరి 1982

— నిఖిలేశ్వర్

# తొ లి ప లు కు

నేడు మన దేశ పరిస్థితి కరిమ్రింగిన వెలగపండులా వున్నది. పంచవర్ష ప్రణాళిక తీరుతెన్నులు చూడగా పైకి ఎంతో అభివృద్ధి సాధించినామని కన్పడినా, 'లోన లొటారం మీద మిటారం' అన్నట్లు గన్పడుచున్నది. కాగితపు ప్రణాళికలు, లెక్కల గారడీలు తప్ప సాధించిన అభివృద్ధి అంతంత మాత్రమే. కాగితపు పులిలాగ మన దేశ పరిస్థితి కొట్టొచ్చినట్లు కన్పడుతుంది. ఎక్కడచూచినా ఆశ్రితజన పక్షపాతం, బంధుప్రీతి, లంచగొండితనం మితిమీరి పోవుచున్నది. ఇవియన్ని సామాన్యున్ని నడుం దినదినం విరుగగొట్టుతూనే వున్నది.

ఎంత కష్టపడి రెక్కలు ముక్కలుచేసి ఆర్జించిన కడుపు నిండక, పేదల డొక్కలు ఎండుతునే వున్నవి. మధ్యతరగతి రైతాంగం ఎంత శ్రమపడి పండించినా పెట్టుబడిదారుల విధాన దోపిడీకి తట్టుకోలేకపోతున్నారు. కొంత మంది సామాన్య రైతులు తమకున్న కాస్త భూమి విడిచి పట్టణాలకు వలసవెళ్ళి కూలి పనిచేసి జీవిస్తున్నారు.

ఎన్ని భూసంస్కరణలు ప్రవేశపెట్టినా అవియన్ని దొడ్డిదారిన భూస్వాములకే ఉపయోగపడ్డాయి కాని, సామాన్యుని తక్షణ కోర్కెలు తీర్చేవిగాకూడ ఉపయోగపడలేదు.

నేటి ఈ జీవన విధానాన్ని మార్చుటకు భూస్వామ్య, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ప్రజలను ఆయత్తం చేయవలసివుంది. ఆ ప్రయత్నం నా ఈ 'భుజంభుజం కలిపి' పాటలలో కొంతవరకైనా వ్యక్తపరచి నా వంతు బాధ్యత

తీర్చుకొనుటకై ప్రయత్నించితిని. తిరిగి ఇవే పాటలను జనం లోకి తీసుకపోయే బాధ్యత ప్రతి పాఠకునిపై నుండగలదని దృఢముగా విశ్వసిస్తున్నాను.

ప్రజలు దైనందిన జీవితంలో ఎట్లు బాధపడుతున్నారో ఆవిషయాలనే నా ఈ పాత్రంలో 'విషయముగా' గ్రహించి వ్రాశాను. అవి అనుభవ సిద్ధము. నా మిత్రులు, అమరజీవి ఠాకూర్ శ్యాంసుందర్‌సింగ్‌కు ఈపుస్తకము అంకితం చేసితిని. మేమిద్దరం వారి అన్నయగు, రాజారాంసింగ్ వకీలు (డాక్టర్ అమర భారతి) పురావస్తు శాఖ పరిశోధకులు. మేమంతా వారి మేనమామయగు గిరిధర్‌సింగ్ వద్ద ఒకేచోట చదువుకున్న వాళ్ళం. తెలంగాణ పోరాటంలో పాల్గొని, పోరాట విరమణ తర్వాత "రివిజనిస్టుల" నాయకత్వం ధాటికి తట్టుకోలేక విడి పోయాం. శ్యాంసుందర్ ఎం ఏ. చేసి, నిజామాబాద్ కాలే జీలో లెక్చరర్‌గా వుండి చనిపోయారు.

ఇది నా నాల్గవ కృతి. శ్రమజీవుల బాధల గాధలను జానపద బాణీలో అందించటంలో ఇది ప్రథమ ప్రయత్న మనడంలో సందియము లేదు.

ఆంధ్రదేశ ప్రజలుకాక, యావద్భారతదేశంలోని ప్రజల పరిస్థితి ఇలాగే వుంది కాబట్టి యావద్భారతంలో శ్రామికవర్గ విప్లవము విజయవంతమయేవరకు ప్రజల హృదయాలలో ఈ పాటలు చోటు చేసుకొని, దేశంలో విప్లవాత్మకమైన మార్పులకు ఇవి ఎంతో తోడ్పడగలవని విశ్వసిస్తున్నాను.

– సర్వేజనాః సుఖినో భవంతు –

– రచయిత.

# భుజంభుజం కలిపి

భుజం భుజం కలిపి నడు-
గళం గళం కలిపి పాడు-
బలం బలం మనకె బలం-
జయం జయం మనకె జయం.

ఈ పీడిత జన సౌఖ్యం
చిరవాంఛిత సంకల్పం
పాత వ్యవస్థకు నాశం
సాధించుటె మన ధ్యేయం ॥భు॥

పెటీ బూర్జువా నడకల
రివిజనిజం పెను ఛాయల
దరిజేరక వెనుదీయక
ధర్మ యుద్ధ మొనరిద్దాం ॥భు॥

త్యాగాలకు వెరవకుండ
భోగాలకు భ్రమచెందక
సమతను సాధింపనడు
మానవతే మార్క్సిజం ॥భు॥

—ఎస్. కె. పిళ్ళై

## ఏదిరా భూమి ?

ఏదిరాభూమిా
దున్నేవానికే....
లేదురా భూమిా!

పిట్టపిట్ట తగవులన్ని
పిల్లి తీర్చినట్టుగానె
భూమి పంపకాలన్నీ
భూస్వామికె దక్కెరా ఏ॥

చేటలోన తవుడు పోసి
కుక్కల నాడించినట్లె
దుక్కిలేని బీద జనుల
కిక్కట్లే దిక్కురా ఏ॥

సంగీతము పాడగానె
చింతకాయ రాలునా
సహనముతో నుండుడంటె
గాడిద లక్షణమేరా.... ఏ॥

ముద్దు ముద్దు మాటలకే
మురిసి మోసపోకురా
సామ్యవాద విజయానికి
సంగ్రామం తప్పదురా ఏ॥

రైతు కూలీలేకమై- రాజ్యము చేపట్టాలీ
నరహంతక పిశాచాల- దురంతాల నణచాలి ॥ఏ॥

## అంబలంత చేదాయెనా ?

అలసి నిద్రి పోతుంటివి
తెల్లారే చుక్క పొడిచె
ఆకటెడ్ల మేపబోవా.... లింగయ్యా
కేకలేయు రెడ్డిగారూ.... ఓ లింగయ్యా

పగలూ రాత్రనక దున్ని
పంటలెన్నో పండిస్తేను
పట్టెడన్నం కరువాయెనా— లింగయ్యా
పాడుబడ్డ బతుకాయెనా- ఓ లింగయ్యా

చలిజ్వరం వచ్చి నువ్వు
చాల బాధ పడూతుంటె
రెడ్డిగారు వచ్చినారా- లింగయ్యా
పని మునిగెననీ తిట్టిరా- ఓ లింగయ్యా

తప్పతర్రి జీతమిస్తె
తాలునంత ఎగదొస్తె
చాలీ చాలని కూడాయెనా— లింగయ్యా
అంబలంత చేదాయెనా- ఓ లింగయ్యా

కష్టమంతజేసి దొరల
గాదెలన్ని నింపి పోసి

— ఎస్. కె. పిళ్ళై

రెడ్డిగార్కి బాకీపడితివా- లింగయా
ఆలు బిడ్డల సాదకుంటివా- ఓ లింగయ్యా

తాత తండ్రి తరము గడిసె
పాలేరే బతుకాయె
కులాన బతు కెట్లుండునో- లింగయా
కుమిలి, కుమిలి యేడుపాయె- ఓ లింగయ్యా

గ్రామ పేదలంత గలసి
ఐక్యమై కదలిరండి
మీ కష్టము తీరిపోవునూ- లింగయా
సంఘ బలం తెలిసివచ్చునూ- ఓ లింగయ్యా.

(మే 1981 ప్రజా సాహితి మాస పత్రికలో ప్రచురితము)

## ఏం బతుకు బతికేది?

ఏం బతుకు బతికేది చెల్లెలా!
ఇంకేం బతుకు బతికేది చెల్లెలా!!

కట్టబోతె బట్టలేదు
కొనబోతే డబ్బులేదు
చాలి చాలని కూలిచేత
చులకన బతుకైపాయె ఏం॥

పండుగ పబ్బాలు వస్తె
పండువెన్నెల బతుకేది
పిల్లజెల్లాకు గుడ్డ
తెల్లదీసె మార్గమేది? ఏం॥

ఆరెండ కాలంలో
అందరం కష్టపడితె
దొర యిచ్చిన పైసలన్నీ
గుడిసె కప్పు కెగిరిపాయె ఏం॥

వచ్చే ఆమాసదాక
నెలజీతం ముట్టినాది
దొరను జీత మడుగ తిట్టు
దసర పండుగెట్లు గడచు ఏం॥

పుట్లకొద్ది పండిస్తేను
పట్టెడన్నం దొరకదాయె

—ఎస్. కె. పిళ్ళే

పట్ట భూములు లేక మనకు
పొడుబడ్డ బతుకులాయె ఏం॥

రెండు రోజులు కడుపునొచ్చి
ఇంటికాడ 'బావ' పంతె
మందు మాకు మాట మరచి
వదిరి వదిరి దొరపాయె ఏం॥

భూములన్ని 'ముడ్డికింద'
భూస్వాములు పెట్టుకోని
సాగుచేయక బీడుగుంచి
చంపుక తింటున్రి జనుల ఏం॥

భూమిపంచి ఇస్తమంటు
నీతి మాట లొలుకబోసె
నాయకుల అసలు రూపు
తెలిసె వచ్చె చెల్లెలా ఏం॥

శాంతి ప్రబోధాలతోటి
జాతిని పీడించుతున్రి
కష్టజీవుల మంత గలసి
కదన రంగ మెక్కుదాం ఏం॥

కరుడు గట్టిన ఈ వ్యవస్థ
గద్దెలనే కదిలిస్తాం
సర్వత్రా సుఖ జీవన
పర్వదినం పండిస్తాం ఏం॥

(మే 1980 ప్రజా సాహితి మాస పత్రికలో ప్రచురితము)

# పంచాయితి బండారం

విన్నారయా మీరు విన్నారయా
వింత విడ్డూరాలు- గన్నారయా వి॥
 కొత్త కమిటీల్‌వచ్చి- కొత్త కతలూజేసి
 కల్లోల పెడుతుండె చిల్లర ప్రజలాను వి॥
పల్లె లన్నింటీన- పంచాయితీ బోర్డులు
జోరుగా వెలిశాయి- చూడండయా వి॥
 భాగ్యవంతులు డబ్బు- బాగా ఖర్చుపెట్టి
 మెంబర్లయిపోయి- మెరిశారయా వి॥
భయపెట్టి యెందరినో- బాగ లొంగదీసి
పోటీకి రాకుండ- వుంచారయా వి॥
 ఏకగ్రీవంగానె- ఎన్నికైనామని
 బలిమిగలవారంత- పలికారయా వి॥
చిన్నోన్ని పెద్దోన్ని- మెల్లంగ జమకట్టి
చిన్న గ్రూపులు కొన్ని- చేశారయా వి॥
 గ్రూపు పెత్తనముకై- గుద్దులాడుచు వారు
 చిల్లర ప్రజలను- మరిచారయా వి॥
అందరిన పెద్దోని- కధ్యక్ష పదవిచ్చి
అధికార కమిటీని- వేశారయా వి॥
 కార్యక్రమ సాధనలో- కాలు ముందుకువేసి
 కాపి వొక్కటి- అచ్చు వేశారయా వి॥

— ఎస్. కె. పిళ్ళై

పన్ను వసూల్‌దార్ల - బాధలూ పడలేక
ప్రజలప్పుడే పన్ను లిచ్చారయా వి॥
ఇచ్చిన పన్నుల ఇట్టట్టె గావించి
ఇరుగు పొరుగు జాడ జూశారయా వి॥

మంచినీళ్ళ బావి- మరమ్మతు లుండవు
రహదారి ఖర్చులు- రాస్తారయా వి॥
సందుగొందులున్న- చక్కని లైట్లను
సందె చీకట్లనే- వుంచారయా వి॥

కొత్త గోడలుకాని- కొత్త యిండ్లుకాని
కట్టటోళ్ళ కార్డర్లు- వస్తాయయా వి॥
పైసలిచ్చినవార్ని- పర్వాలేదంటారు
పైసలివ్వకుంటె- పడుతాయి తకరార్లు వి॥

పక్షపాతంబట్టి- కక్షలెన్నో బూని
కఠినంగాను కష్ట- పెడుతారయా వి॥
కంచె తాను చేను- కలయ మేసినవేళ
కాపోళ్ళ కేగతి- గల్గూనయా వి॥

ప్రజల మెప్పుబడసి- పనిచేసె కమిటీని
ప్రజలంత గలసి చే- పట్టాలయా వి॥
కపట వేషగాళ్ళ- కడు దూరముంచియు
కనిపెట్టి కమిటీని- నిల్పాలయా వి॥

(సారస్వత జ్యోతి సంకలనంలో ప్రచురితము)

# అప్పు తీర్చే మార్గమేదిరా ?

ఆరెకరాల భూమివుండి
ఆనందంగ బ్రతుకలేక
అప్పుల పాలవుతుంటివా- పోశయ్యా
తిప్పల పాలవుతుంటివా- ఓ పోశయ్య

గిర్వి బేంకుల భూమిపెట్టి- ఇంజన్నొ కొనితెస్తివి
దాని మేత మేపలేకను- పోశయ్యా
దండుగ పాలవుతుంటివా- ఓ పోశయ్య

సావుకారు దగ్గరికెళ్ళి- ఎరువులన్ని ఎరువుతెచ్చి
పంట చేతి కందగానె- పోశయ్యా
పట్టలేని సంబ్రిపడితివా- ఓ పోశయ్య

ఎల్లెంబీ కిస్తువచ్చె- ఇచ్చిన సావుకారువచ్చె
అప్పుతీర్చె మార్గమేదిరా- పోశయ్యా
ఉన్న గల్ల ఊడ్చుకపోయిరా- ఓ పోశయ్య

కంట నీరు కార్చినా నిను- కనికరించెటోడెవడు
కొనబోతె కొరివి ఆయెరా- పోశయ్యా
అమ్మబోతె అడవి ఆయెరా- ఓ పోశయ్య

గ్రామీణ పేద సంఘంలోన
కలిసిపొయ్యి కదలిరమ్మొ
మీ కష్టం తీరిపోవునూ- పోశయ్యా
సంఘ బలం తెలిసివచ్చునూ- ఓ పోశయ్య.

—ఎస్. కె. పిళ్ళే

# ఓట్ల పండుగ

వస్తుంది వస్తుంది ఓట్ల పండుగ— హేయ్
రానే వస్తుందిరా సీట్ల పండుగ

కలవాల్లే మల్లెందరో
ఎన్నికల్లో నిలుస్తారు
ఖర్చులు బాగా పెట్టి
గరీబులను ముంచుతారు వ॥

కల్లూ, సారాలు దింపి
కైపుల్లో ముంచుతారు
కులపూ పెద్దలనుజేరి
గుసగుసలు పెట్టుతారు వ॥

అరి, తోరి, అనువారె
అయ్యా, అప్ప అంటారు
మర్యాదలు బెంచుతారు
మల్ల మరచిపోతారు వ॥

దొరతనం తిరుగ బిడ్డ
నరుని నొంటిగాన్ని జేసి



భుజం భుజం కలిపి

...ంటి మాయిలతోటి
గద్దెలపై కూర్చుంటారు వ॥

ఓట్లన్నీ గుంజుకోని
సీట్లపైకి బ్రాకుతారు
ప్లేటు ఫిరాయించి మనల
నట్టేట్లో ముంచుతారు వ॥

కల్లు సార త్రాగిస్తారు
కాసుల నెగజల్లుతారు
డార్జన్యాల్ సాగిస్తారు
దర్జాగా గెలుస్తారు—

—ఎస్. కె. పిళ్ళై

# రి వి జ ని జం

అసలు ఆశయాలకే
ఎసరుబెట్టు రివిజనిజం
మార్క్స్ మూల సూత్రాలను
మంటగలుపు రివిజనిజం

లెనిన్, స్టాలిన్, మావో జెడాంగ్
ఆశయాల నణచు నిజం
కూలి, రైతు విజయాలను
తూలనాడు రివిజనిజం

ప్రజాస్వామ్య రాజరికం
వాంఛించును రివిజనిజం
మార్క్సిజం మాదెయంటూ
బుకాయించు రివిజనిజం

ఉద్యమాన్ని నీరుగార్చు
ఉద్రేకం చల్లార్చు
కార్మిక, కర్షక, శ్రామిక
శత్రువురా రివిజనిజం.

# కిం కర్తవ్యం?

మాటలలో అభ్యుదయం
మూటలకై ఆరాటం
గాంధీజీ సూత్రాలను
గమ్మత్తుగ జపియించే
మనిషీ.... ఓ మనిషీ.... కిం కర్తవ్యం?

పెదవులపై దరహాసం
యెదలోపల పరిహాసం
కడుపే చిర కైలాసం
సుడిగుండమె కైవసం
మనిషీ.... ఓ మనిషి.... కిం కర్తవ్యం?

అంటరానివిగనె వున్న
గిరి, హరిజన జీవితాలు
గంటల తరబడి గనీ
ఊకదంపు భాష్యాలు
మనిషీ.... ఓ మనిషీ.... కిం కర్తవ్యం?

బుజ్జగింపు మాటలతో
బొజ్జ నింపుకోవడం
పదవులకై, సంపదకై
పగడ్బంది పన్నాగం
మనిషీ.... ఓ మనిషీ.... కిం కర్తవ్యం?

—ఎస్. కె. పిళ్ళై

నయం నయం నీకంటే
వట్టి మిట్ట వేదాంతి
భయం భయం నితోటే
ప్రగతి కోరు జనావళికి
మనిషీ.... ఓ మనిషీ.... కిం కర్తవ్యం ?

ఆచరణకు కడు దూరం
అన్యాయపు మాటలాపు
స్వార్థమె- సరిబాటకాదు- ప
రార్థము సైతము కనవోయ్.

మనిషి రక్తము పీల్చి
మహాగ బతికిన నేమి ?
సమతకు మమతకు స్థానం
సాధించుటె నీ ధ్యేయం.

# పో రు స లు పు

భయంవీడి- జవంబెంచి
నిబ్బరంగ పోరు సలుపు
పల్లెటూరి రైతా- ఓ
పల్లెటూరి కూలీ....

దొడ్డదొరల చాకిరితో
కూటికి కరువైన్నాళ్ళు
అంధకార బంధురాన
అణిగియుండు టెన్నాళ్ళు భ॥

ముప్పదినాలుగేండ్లు నిండె
ముప్పు తిప్పలే బతుకాయె
సోషలిజం బురఖాలో
భేషజమే సాగుతోంది భ॥

పాలకవర్గం మరచిన
ప్రజలంతా కదలండోయ్
ప్రజలంటే మేమేనని
ప్రజలతోనే మేమని భ॥

ఎస్. కె. పిళ్ళే

# ఇది విపరీతము

ఆకలి కేకల భగభగ మంటలు
చీకటి బజార్ల దౌర్జన్యములు
పర పీడకుల పకపకలు
నిరుపేద గుండెల- దడదడలు

ఎన్నాళ్ళూ ఇంకెన్నాళ్ళూ
ఇది విపరీతం- ఇది విపరీతం

మాపటి పూటకు మతి చలించుట
రేపటి పూటకు మది తపించుట
పిడికెడు మెతుకులకు గాలించే
బీదా, బిక్కీ బతికేదెట్లనో ఇది॥

దున్నే రైతుకు దుక్కే లేక
పన్నుల భారం భరించలేక
బీదవాళ్ళకే బాధలు పెంచి
చావు బతుకుల స్వరాజ్యమయ్యే ఇది॥

ధరలు చుక్కల పక్కల జేర
దొర లానంద డోలల నూగ
కూడూ గుడ్డా కొంపలు కరువై
కుమిలే జనాల వెత లెన్నాళ్ళు ఇది॥

ఆకలి యాత్రల ఆపని సమ్మెల
అంతం జేయగ తుపాకి కాల్పులు

అహింస ముసుగున అఘాయిత్యములు
అక్రమ పాలన మెన్నాళ్లా

ఎన్నాళ్ళు ఇంకెన్నాళ్ళు
ఇకపై సాగదు కొన్నాళ్లైనా
ప్రజా విరోధుల పీచమడంచగ
సజావుగానే కదలండోయ్.

## ఏమని చెప్పాలి?

ఏమని చెప్పాలి అక్క!
ఇంకేమిని చెప్పాలి అక్క!!
నడిరేయి వచ్చినారు
నా ఇల్లు ముంచినారు

మోతబరీ దొరగాడు
పోలీసోల్లు, సుంకరోల్లు
నీమర్దిని పట్టుకుని
పక్కలిరుగ దన్నినారు ఏ॥

'గుండెలో బండేసినట్లయ్
గోదుగోడున ఏడ్చినాను'
తప్పు చేతుల పెట్టుమన్న
పప్పులుడుకవ్ పొమ్మన్నరు ఏ॥

—ఎస్. కె. పిళ్ళే

చిల్లిగవ్వకు కొరగాడు
కూలి సంఘం బెట్టినాడు
నక్సలైట్లో గలిసినాడు
నాటకాలాడ్తున్నారు ఏ॥

మూడునెల్ల జాడాయెను
ఏడున్నడో దెలియరాదు
పోలీసోల్లొచ్చి మొగని
సోపతోల్ల జాడడిగిరి ఏ॥

పరంబోకులు దున్నుటకు
పడికట్టు కట్టినారూ
దొరగారికి కన్నుగుట్టి
చెరసాలకు పంపినారు. ఏ॥

సర్కారూ మనదవిరి
పరంబోకులు మనవనిరి
తీర దున్నుటకు పోతే
తీటతీర వాయించిరి ఏ॥

సర్కారు మనదైతే
పరంబోకులు మనవైతే
దొరల కొమ్ము గాచుడేల ?
మనల గొట్టి చంపుడేల ? ఏ॥

# ఏమి జూచి బతుకుదాం ?

ఏమిజూచి బతుకుదాము
ఎన్నడు సుఖపడుదామూ
వేళ్ళమీద లెక్కబెట్టగల
వాళ్ళకె బానిసలమా ఏ॥

ఉత్పత్తి సాధనములు
కొంతమంది చేతులుండ
భూమిమీద రెక్కలేసి
భూమట్రిం అవుతుంటిమి ఏ॥

భూములన్ని గలిగియుండి
బూర్జువ డిగ్రీల్లు పొంది
పెద్ద పెద్ద నౌకర్లన్నె
హద్దుమీరి చేపట్టిరి ఏ॥

పది గజాల కొంప లేక
ఫుట్ పాత్ లపై పంటిమి
పదంతాస్తుల మేడలందు
పరువుతోటి బతుకుతున్రి ఏ॥

స్వాతంత్ర్యం వచ్చెనని
సంబరపడిపోతిమి
వేడిపాలు చవిచూసిన
పిల్లులోలె తిరిగితిమి ఏ॥

స్వాతంత్ర్యం వచ్చెనా....?
సంబరాల బతుకేదీ....
ఉన్నవారి సుఖములకే
ఊడిగాలు చేస్తుంటిమి ఏ॥

చూచి, చూసి వేసారి
వేచియుండు టెన్నాళ్ళు
ఊరు దూరమౌతుంది
కాడు దగ్గరి కొస్తుంది ఏ॥

ఉప్పెనగా పైకిలేచి
ఉద్యమాల్లో చేరి నడువు
జయ జయ నాదాల దేలి
విజయ గీతి పాడండి!

# గొర్రెతోక బెత్తెడేను !

ఎవరిదార్ల వాళ్ళుపోతె
ఎవరి పనుల వాళ్ళుంటె
ఎక్కడేసిన గొంగడీ
అక్కడె పడియుంటదీ ఎ॥

ఎవరో వచ్చి, ఏమొదెచ్చి
ఎవరికొరకో పెడ్తరంటె
తన్ను మాలిన ధర్మమా
ఎన్నడు పని కాదురా ఎ॥

భ్రమలు బెంచి శ్రమలుపడి
భూస్వాముల బతికిస్తిమి
బక్కచిక్కి డొక్కలెండి;
బతుకురోసి దుఃఖిస్తిమి ఎ॥

ఇప్పుడేమొ, అప్పుడేమొ
ఎన్నడైన బాగుపడగ
చూచి చూసి కండ్లువాచె
రోజు రోజు పాడుకొచ్చె ఎ॥

చూచి చూడకుండపోతె
దోచెటోళ్ళు దోస్తుండిరి
తీరజూస్తె మన బతుకులు
గొర్రెతోక బెత్తెడేను ఎ॥

పదుగు రొక్కటైననాడె- వెతలన్నీ తీరిపోవు
సంఘటితంబైననాడె- చక్కనైన బాట దొరుకు ఎ॥

—ఎస్. కె. పిళ్ళే

## గూ గు మ్మ డీ

అప్పులోడు వచ్చి గూగుమ్మడీ
ఆకిట్లో కూకుండె గూగుమ్మడీ
మిత్తి కడుదామన్న ,,
చేతిలో పైసేది ,,
పాలేరుగావుండి ,,
అప్పు తీర్చవయ్యో ,,
మిత్తి అసలును మించె ,,
తీర్చని బరువాయె ,,
ఆస్తేమి లేదాయె ,,
ఏమమ్మి కట్టేది ? ,,
పిల్లోడ్ని కుదబెట్టి ,,
అప్పు కట్టవయ్యో ,,
నాలుగేండ్ల నుండి ,,
నాబిడ్డ పాలేరు ,,
తాకట్టు పడివుండె ,,
తప్పునెట్లీ బాధ ,,
భార్యను కుదబెట్టి ,,
అప్పు కట్టవయ్యో ,,
పాతికేండ్ల నుండి ,,
పటేలు పనిమనిషి ,,

చక్రి వడ్డీలాయె గూగుమ్మడీ
చావన్న రాదాయె ,,
పాటేలు నెదిరించి ,,
పరువు నిలబెట్టోయ్ ,,
వెట్టిచాకిరిజేస్తు ,,
ఎట్లాగ బతికేది ,,
మనల దోచెటోళ్ళ ,,
తన్నకుంటెనేల ,,
అర్వ్యచాకిరిపోను ,,
తిరగబడవోయ్ ,,

జనవరి 1982 ప్రిజాసాహితి మాసపత్రికలో ప్రచురితము)

## హ రి జ న కా ల నీ లు

ఊరుబయట కాటికాడ
హరిజనుల కాలనీలు
ఏరి పారేసినట్టుంటె
పూరి పాకలు వెలసినవీ ఊ॥
ఊరుపక్క నున్నభూమి
కోరుకొన్న దొరకదాయె
తోట భూములని పెట్టి
తోసేసిరి దూరంగా ఊ॥

ఎస్. కె. వి.శ్వే.

మాల, మాదిగ చెలిమి
మహనీయ మైనదంటు
హరియను ముద్దు పేరెకాని
అంటనీయరీ దొరలు ఊ॥

అంటరాని తనమునే
కంటు గించుకుంటారు
అన్ని రంగాలలోనూ
అవరోధము కలిగిస్తరు ఊ॥

సీట్ల రిజర్వేషన్‌ల;
ఓట్లతో వచ్చేసినోళ్ళు
దొరల యింటి కుక్కలై
దొరతనాన తిరుగుతున్రు ఊ॥

ఎన్నికల పాచికల్లో
వెలసినవీ కాలనీలు
అరచేతిల బెల్లంపట్టి
మోచేయి నాకిస్తుండ్రు ఊ॥

(జనవరి 1981 ప్రజాసాహితి మాసపత్రికలో ప్రచురితము)

# ఏ మ నా లి ?

గద్దెలపై నధివసించి
మిద్దెలపై నివసించి
పేకాటలతో మురిసే
పెద్దల నేమనాలి....?

ఉన్నత డిగ్రీలు పొంది
ఉన్మత్త వ్యసనమ్ముల
ఆనందంకై బ్రతికే
ఆకతాయుల నేమనాలి ?

మనిషిని మనిషిగ నెంచక !
మలిన నాగరికత సృజించి
శ్రామిక రక్తము త్రాగెడి
జలగల నేమనాలి....?

రెక్కాడిన బుక్కాడక
దిక్కులేని దీనదశన
పూరి కొంపలందున్న
పూటకాపు నేమనాలి ?

(నవంబర్ 1977 సత్యార్థి మాస పత్రికలో ప్రచురితము)

— ఎస్. కె. పిళ్ళై

# గున్నమామిడి చెట్టుకింద

(సిరిమల్లె చెట్టుకింద రాగులమ్మో- రాగులమ్మా- మాదిరి)

గున్నమామిడీ చెట్టుకింద
శ్యామలమ్మో శ్యామలమ్మా- నువు
సిన్నవోయ్ కూచున్నవ
శ్యామలమ్మో శ్యామలమ్మా

పెండ్లీకెదిగిన బిడ్డ వుంది
పెడుదామంటె కట్నంలేదు
పంట చేతి కందునంటె
పాడు వానలెత్తుకపాయె

దుక్కిటెద్దు కూలబడె
శ్యామలమ్మో శ్యామలమ్మా
దిక్కు తోచకుంటివా
శ్యామలమ్మో శ్యామలమ్మా

పాడు రోగాల్ వచ్చుచుండె
పైరులన్ని ఎండుచుండె
ఖర్చులేమొ అధికమాయె
రాబడేమొ తగ్గుచుండె

దుక్కిటెద్దు కొనలేక
శ్యామలమ్మో శ్యామలమ్మా
దుఃఖపడుచుంటివా
శ్యామలమ్మో శ్యామలమ్మా

పట్నంబంపిన పిల్లగాంది
పనికిరాని చదువైంది
చదువురాదు దున్నరాదు
సడగులపొన్న తిరుగుడైంది

సంసార మీదలేక
శ్యామలమ్మో శ్యామలమ్మా
సతమత మౌచుంటివా
శ్యామలమ్మో శ్యామలమ్మా

ఉన్న భూమి అమ్ముకుంటె
కొన్ని రోజులు కాలంగడిచె
ఏటేటా ఆస్తియంత
ఏరులాగ ఇంకిపాయె

ఉత్త చేతుల బతుకాయె
శ్యామలమ్మో శ్యామలమ్మా
చిత్తమంత రందిపాలె
శ్యామలమ్మో శ్యామలమ్మా

సన్నకారు రైతులకు
సర్కారేమి సాయంజేసె
ఉన్న ఆస్తు లమ్ముకోని
ఊడిగమే చేయుచుండ్రి

వట్టి మాటల బూటకమ్ము— శ్యామలమ్మో శ్యామలమ్మా
నట్టేట మునుగుచుంటివి— శ్యామలమ్మో శ్యామలమ్మా.

— ఎస్. కె. పిళ్ళే

# దొరోల్ల దోపిడి

(పులి జంపిన ఇదానం బాబయ్యా- మాదిరి)

దొరోల్ల దోపిడి ఇదానం
బాబయ్యా_ నేను
ఇవరంగ సెప్తుతాను
ఇనుకోండి బాబయ్యా

గొర్ల గాసె గొల్లోల్లు
గొర్రెలియ్యకుంటేను
సెలకకాడ దొరకబట్టి
సేతులు కట్టేసి కొట్టు దొ॥

పసులగాసె- పసులోడు
నెలజీతం అడుగబోతె
బజార్ల దొరికిచ్చుకొనీ
బండు బూతులు తిట్టుతారు దొ॥

పాలేరు పెండ్లాము
యెనకంతుల రాకుంటె
పాత బాకి లెక్కగట్టి
పనినుం డెల్ల గొట్టుతరు దొ॥

సేతజెయ్య రాలేదని
మాదిగోన్ని బిలిపించి



భుజంభుజం కలిపి

చెప్పుల జోడేదంటూ
చెప్పులిరుగ తన్నుతరు దొ॥

వడ్ల కమ్మరోల్లుగూడ
వట్టి యెట్టి చెయ్యాలి
బాపతెంత యిచ్చినంతె
పట్టుకొచ్చుకోవాలి దొ॥

రెండెడ్లుంటే సాలు
దొరకు బండి కట్టకుంటె
పల్లెన వాడిగ బతుకడు
పగలే సుక్కలు పొడును దొ॥

కట్టమన్న జేసుకోని
యెట్టనన్న వుందమంటె
చిల్లిగవ్వ కూలివ్వరు
ఎల్లకాల మెట్లు గడుచు దొ॥

కులాలంటు యిడిపోక
కూడండే పేదోల్లు
ఈ దొరల జులుం పోదు
ఈ దోపిడి మాసిపోదు

— ఎస్. కె. పిళ్ళే

# దేవుడు

ఔనంటారా- కాదంటారా
ఏమంటారూ- మరేమంటారూ

తెల్లవారి లేసి- దేవుళ్ళనూ మొక్కి
కల్లబొల్లి కబుర్లతొ- కాలాన్ని గడిపేసి
ప్రొద్దు కుంకేసరికి- బొజ్జలను నింపేసి
దగాకోరు లెందరో- దర్జాగ వున్నరంటె ఔ॥

దేవుడేమి చేసిండు- మనిషే మారిండంటే
మనిషె మారితే మరి- దేవుడేమి చేస్తుండు
అన్యాయాల్ జరుగుచుండ ఆపివేయడెందుకు
పూర్వజన్మ కర్మల- పుణ్యాల దేలుటేమి? ఔ॥

దేవుని గుళ్ళె మన్నుబొయ్య- ఎంతపని చేస్తుండు
కష్టపడి పనిచేస్తె- కడుపుమీద కొడుతుండు
అందరిని ఒకేరీతి- అతడు చూడడెందుకు
కష్టపడనోళ్ళకే- యిష్టంగ పెడుతుండు ఔ॥

పేదోళ్ళ కష్టాలు- మొక్కులతో తీరవు
లేనోళ్ళ దేవుళ్ళు- దగ్గరికే రానీయరు
ఉన్నోళ్ళే పదివేలు- హుండీలో వేస్తారు
లంచాలు పెడుతారు- లాభాలు కొడుతారు ఔ॥

దేవుళ్ళెక్కడనైన లంచాలు తింటారా
పట్టుమని యిచ్చిన- పలుకనైన పలుకుతారా
మానవత్వమును విడచి- మనుషులే తింటారు
దేవున్ని కొలబద్ద- జేసి కొలుస్తారు ఔ॥

# దేశం ఏమైతేంది ?

దేశం ఏమైతేందీ- ద
ళారీ పాలనలో నేడు
ప్రతి పనికీ- లంచాలెన్నో
పగడ్బందిగ- నడుస్తున్నవి దే॥

బీరు, బ్రాండీల, దావతులు
బిల్లులపై పడు సంతకాలు
చెక్కులు చెకచెక తయ్యారౌను
కుప్పలు గూలును డబ్బులు దే॥

ఆఫీసర్లకు- కంట్రాక్టర్లకు
ఆదాయంపై- పర్సెంటేజులు
ఇసుకల బూడిద- సిమెంటు స్వాహా
మరమ్మతులన్నీ- బిరాన గూలును దే॥

కర్మ సిద్ధాంత- నీతి బోధలు
కాగితాలపై- గట్టి ప్లానులు
కరి మ్రింగిన- వెలగపండులా
కాజేస్తుండ్రు- బజటంతా దే॥

ప్రజా నాయకులు- పరిపాలకులు
దేశ ద్రోహులు- స్వార్థపరులు
ఆశలుగొలిపి- మోసము జేసి
దేశ సంపదను- దోచేస్తుండ్రు దే॥

జాతీయ భద్రతా అర్డినెన్సుతో- జాతి పురోగతి నడ్డుచుండురు
సర్వ మానవ కళ్యాణానికి- సౌఖ్యం కూర్చే దెన్నడూ దే॥

— ఎస్. కె. పిళ్ళై

# నిలదీసి అడుగరేమి ?

ఎంతకాలమీ దోపిడీ
అంతటనూ సాగుతోంది....
నిలదీసి అడుగరేమి ?
పటేండ్లనూ- పట్వార్లనూ—
ఖాస్రా పహాణీలు జూపి
ఖామిల్ పట్టా జేస్తామని
పదులూ, వందలు, వేలుగ
లంచాలను తింటరబ్బ ఎంత॥

ఐదెకరాల భూమికి
అసలె కిస్తు లేదంటె
ఆర్డరేదొ చూపుమని
అదికూడ దోస్తున్నరు ఎంత॥
పంచాయితుల్ పెట్టించి
పదుగురునీ కూడగట్టి
నందంటే- పందంటూ
తిమ్మిని బమ్మిగ జేస్తరు ఎంత॥
అన్యాయపు బాటపట్టి
అమాయకుల నోళ్ళుగొట్టి
తరపుదారి కుక్కలతో
తన్ని దోస్తు మేస్తుంటరు ఎంతో

బ్రతుకవచ్చిన బిచ్చగాళ్ళు
అడుక్కు తినుదాంట్లోనే
అసలు కొంత గాజేస్తరు
కాదంటే యెగబడుతరు ఎంత॥

సంపద లెంతగ పెరిగిన
సంతృప్తే లేక వాళ్లు
ప్రజలనేమొ కొల్లగొడుతు
పైపైనే బతుకుతారు ఎంత॥

కాలమేమొ మారిందని
కనిపెట్టి తిరుగండని
నేల విడిచి చేయు సాము
నింక విడిచి వేయుమనుడి ఎంత॥

## గుండె దిటవు గుండర !

లబోదిబో మొత్తుకుంటె
లాభమేముందిరా....
దెబ్బకు దెబ్బందించరా- చిన్నోడ
ఎత్తుకు పై ఎత్తువేయరా-
పిరికిపంద లోలెవ్వుంటె
ఉరికివచ్చి తంతారు
కర్రలే లేకుంటెరా— చిన్నోడ
గొర్రెగూడ మనల గరచురా.

—ఎస్. కె. పిళ్ళే

పరులను పీడించునట్టి
నరహంతక దొరలబట్టి
తన్ని తన్ని వదలాలిరా- చిన్నోడ
తగినశాస్తి జెప్పాలిరా.

మానభంగాల్ చేయునట్టి
మానహీన గుణహీనుల
మక్కలిరుగ దన్నాలిరా- చిన్నోడ
మంచిబుద్ధి గరపాలిరా.

'ధనముగల వానికింద
దక్కాలేమనుట తప్పు'
గుండె దిటవు కలిగివుండరా- చిన్నోడ
కండబలం జూపించురా.

అప్పుసంగ వుంటేను
ముప్పుతిప్పల బెట్టుతారు
నిజం; ఇది తెలుసుకోరా- చిన్నోడ
భుజం భుజం కలిపి నడువురా

సంఘబలం లేకుంటే
చించి చెండాడుతారు
గ్రామ పేద లందరినీ- చిన్నోడ
ఐక్యపర్చు సంఘంలోన.

# చేతు లెట్ల వచ్చునురా!

చేతులెట్ల వచ్చునురా- పోలిసోడా- యమ
యాతనలు బెట్టెదవు- పోలిసోడ

దోపిడి లేనట్టి ఒక్క
దొడ్డ సమాజమ్ము నిల్ప
పోరునల్పు వీరులను
పట్టి ఛెండాడెదవు చే॥

తాబెదారు పెద్ద యెవడొ
ఆనతివ్వగానె లేచి
కన్నతల్లి దేశప్రజల
కాల్చివేసి చంపెదవు చే॥

కోడెవయసువారు మీరి
కోరి ప్రజల సేవజేయ
పల్లె పల్లె దిరుగుతుంటె
పట్టి దొంగ లంటవురా చే॥

చిత్రహింస లెన్నొపెట్టి
చిట్టడవికి తీసికెళ్ళి
చెట్టుకొకల గట్టేసి
పిట్టలోలె గాల్చెదవు చే॥

— ఎస్. కె. విశ్వే

దొంగయెవడొ దొరయెవడో
తెలుసూకో లేకపోతె
రక్షకభటు ముసుగులోన
రాక్షసత్వమే కదరా చే॥

ఝూటు కేసు లెన్నొ పెట్టి
ఠానలోన గొట్టెటోడ
బతుకుతెరువు కాశపడే
బడుద్ధాయివే కాదా చే॥

అక్కా చెల్లెండ్రపైన
అన్నా దమ్ముల పైన
ఆయుధాల నెత్తనేల
ఆపర నీ చెయ్యెక్కడ చే॥

పొట్టకూటికై నువ్వు
పోలీసూవై నావూ....
ప్రజలంటే మనమెగదా
ప్రజల కాల్చి చంపుటేల ? చే॥

ప్రజల మాట పెడచెవిన
బెట్టిన యిక బతుకు లేదు
జులుంవద్దు గిలుంవద్దు
సత్యమైన బాట పట్టు చే॥

# లేరా విద్యార్థీ!

లేరా విద్యార్థీ, లే
లేరా విద్యార్థీ!

పుక్కిడి పురాణాలను
పున్నెమని చదువనేల?
బ్రతుకు బాట చూపలేని
భ్రమలుగొల్పు విద్యలేల? లే॥

గ్రహ గతులను దెలియగ, వి
గ్రహముల పూజించుటేల?
బూసిన బంధాలు విడని
భావదాస్య మేలరా? లే॥

అంధకార మత మౌఢ్యాల్
ఆలయాల్లో భజనలేల?
విలువౌ విజ్ఞాన విషయ
ముల దూర ముంచుటేల? లే॥

ప్రాత కొత్తలందు సత్య
నీతియేదో తెలుసుకొని
జాతి పురోగతికి జ్ఞాన
జ్యోతిని వెలిగించరా లే॥

(ఏప్రిల్ 1980 ఉపాధ్యాయ మాస పత్రికలో ప్రచురితము)

—ఎస్. కె. పిళ్ళే

# లేరమ్మ మహిళలంత

లేరమ్మ మహిళలంత
రారమ్మ మహిళలంత
సంఘ దురాచారముల
సంస్కరింప బూనరమ్మ లే॥

వంట ఇంటి కుందేళ్ళుగ
ఇంటనే పడి యుండుటేల ?
భ్రష్టాచారమ్ములపై
ధ్వజమెత్తగ లేవరమ్మ లే॥

మేనరికపు పెళ్ళిళ్ళు
ఆరు తరాలకు కూడవు
కుల మతాల కతీతంగ
పాటించగ లేవరమ్మ లే॥

ఉచ్ఛ నీచ అంతరాలు
ఉన్మాదపు పోకడలను
దరిదాపుకు రానీయక
తరిమికొట్టి లేవరమ్మ లే॥

పుట్టె మట్టె బంధనాలు
బిగియించిన పురిత్రాళ్ళు

ప్రేమ వివాహపు శత్రులు
ప్రారబ్ధపు బోధనలు లే॥

చచ్చినోళ్ళకు శ్రాద్ధాలు
పురోహితుల కల్పనలు
అశాస్త్రీయ మూర్ధరహిత
మవి యంతము జేయరమ్మ లే॥

స్వేచ్ఛయె మన జీవితం
ప్రశాంతమె జీవిత ధ్యేయం
సమతా భావన సృజింప
సమైక్యమై లేవరమ్మ లే॥

—ఎస్. కె. పిళ్ళే

# పదరా పదరా పల్లెలకు

పదరా పదరా పల్లెలకు- మన
పల్లెటూళ్ళెరా భాగ్యపు నిధులు-

భూస్వాములు- వడ్డీ బేపారులు
పల్లె జనులను- కొల్ల గొట్టిరి
శ్రమ జీవులను- బ్రతుకనివ్వక
శ్రమనే దోచుక- బ్రతుకుచుండిరి పII

అరక ఉండినా లాభంబేమి ?
అర యెకరం భూమే లేదాయె
కౌలుకు, పాలుకు- పరుల పంచలో
కష్టపడుటకే- కాలంగడచె పII

త్యాగాలన్ని- శ్రమజీవులకు
భోగాలన్ని- భాగ్యవంతులకు
ఈ యన్యాయెన్నెదిరించాలి
పనికే ఫలితం కలిగించాలి పII

దోపిడి దొంగల పీచమడంచగ
ప్రజాతంత్ర పోరాటం సలుపగ
భారతదేశపు భాగ్యము పండగ
సామ్యవాద సాధన ఫలించగ. పII

# నా కలం!! నా గళం!!

ఇది నా కలం! ఇది నా గళం !!
ఇది నా పాట_
ఇది నా మదికింపైన.... మహోజ్వల బాట-

నాకలం రాయు_ నా గళం పాడ
భూనభోంతరాల- ప్రభంజనంవలె
ప్రతిధ్వనించు,
విప్లవ సందేశం- వినిపించు-

నాకలం కూర్చేది- నా గళం మోగేద్ది
అంతర్జాతీయ శ్రామిక గీతం
అఖండ విజయ సాధనోత్సాహం
సామ్యవాదం- సమానత్వం
సౌభ్రాత్రం- సౌహార్ద్రం

అంబరాల చుంబించు
అద్దాల మేడలందు
ధనవంతుల త్రిజోడీల
కనకం రాసులకోసం
తమ రక్తం నీరుజేసి
తమ స్వేదం కార్చినట్టి
శ్రామిక జగజ్జనావళికి
స్వేచ్ఛా వాయువు పీల్చగ
నా కలం మద్దతు నిచ్చును
నా గళం గానం చేయును

—ఎస్. కె. పిళ్ళై

గాంధేయ సిద్ధాంతాల
గారడీ రాద్ధాంతాల
కులమత విభేదాలు
వల్లించు పెను ఘాతాలు !
అరణ్య రోదన కావించగ
ఆహ్వానించును నా కలం !
ఆదేశించును నా గళం !!
అహింస సూత్రాల, హింసాకృతుల
అమంగళాల, శుభాశీర్వాదపరుల
అభివృద్ధి నిరోధక చర్యల
ఆలన పాలనజేయు ప్రభుల
లాలించగలేదు నా కలం !
రాగాలాపన జేయదు నా గళం !!
ప్రజల ప్రాణాలతో చెలగాటమాడి
పర్వం పండించుకునే- ప్రజాధినేతల
ప్రగతి నిరోధుల పని బట్టించగ
యుగ ధర్మంబిదియని పురికొల్పగ
హింసాకృతియం దహింస క్రతువుల
సత్యం, శుభం, సుందరం సృష్టింపగ
సాగింతును నా కలం !
మోగియింతును నా గళం !!
(సత్యార్థి మాస పత్రికలో ప్రచురితము)

# చందమామ

భారతదేశాన చందమామ
పరిపాల నెట్లుంది ? చందమామ
భారతదేశాన ,,
పరిపాలకులంత ,,
పెట్టుబడులు పెట్టి ,,
దర్జాగ వుంటున్రు ,,
టాటా బిర్లాలంత ,,
కోటాన కోట్లయిరి ,,
సోషలిజమంటు ,,
కొంగ జపముచేస్తు ,,
ప్రభుత్వమే నేడు ,,
ప్రజల పీడిస్తుంది ,,

ప్రజాస్వామ్యమందు చందమామ
దోపిడి యెట్లుండు ? చందమామ
ఓటుతో సీటంటు ,,
ఓట్లను కొంటుంది ,,
సీట్లు దొరికినంక ,,
నాటకాలాడుతున్రు ,,
భూసంస్కరణలనీ ,,
భూమంత గాజేసిరి ,,

— ఎస్. కె. పిళ్ళై

భూములమ్ముకోని — చందమామ
ఏమేమి చేసికి— చందమామ
పట్నాలకే వెళ్ళి ,,
పెట్టుబడులు పెట్టి ,,
వ్యాపారమూ జేసి ,,
వర్తకులైనారు ,,
సీలింగు వుండంగ— చందమామ
భూములెట్లమ్మికి— చందమామ
పాలేరు పేరిట ,,
సేరుదారు పేర ,,
రికార్డులు దిద్దించి ,,
అమ్మక దొబ్బిరి ,,
గరిష్ట పరిమితికి ,,
భూమి వుంచుకోని ,,
ఈ రీతి నాటకాల్ ,,
భూస్వాము లాడిరి ,,
భూములమ్ముతుంటె- చందమామ
కొన్నవారెవరయ్యా- చందమామ
భూమి కలిగున్నోడె ,,
భూములను కొన్నాడు ,,
మిగులు భూమేదని ,,
ఎదురు ప్రశ్నేసిరి ,,

మోస పూరితమైన- చందమామ
నినాదాలతోటి ,,
దేశ సంపదనంత ,,
కొల్లగొట్టుతుంట్రు ,,
ఇతర దేశాలలో- చందమామ
మన కీర్తి ఎట్లుంది? చందమామ
విదేశాలనుండి ,,
అప్పు లెన్నో దెచ్చి ,,
పప్పుకూడు గుడువ ,,
పాటుబడుతున్నరు ,,
అమెరికా, రష్యాకు ,,
అమ్ముతరు దేశాన్ని ,,
మధ్య దళారీలు ,,
మహాగ బతుకుతుంట్రు ,,
ఏడిండ్ల కూనలై ,,
ఏడుస్తున్నరు జనులు ,,
చీటికి మాటికి ,,
నోటికి తాళం వేస్తు ,,
కూడు గుడ్డకొరకు ,,
పోరాడేవారిని ,,
చీకటి కొట్లల్లో ,,
బంధించుచున్నారు ,,

— ఎస్. కె. పిళ్ళై

భూస్వాములందర్ని - చందమామ
బహుగ పోషిస్తున్రి ,,
అందుకే యిప్పుడు ,,
ఏపాప మెరుగని ,,
గ్రామీణ పేదలు ,,
మహా విప్లవం కొరకు ,,
మార్గాన్ని వెతుకుతు ,,
మనల రమ్మంటున్రు ,,
ప్రజాతంత్ర పోరుకు ,,
ప్రజలంత కదలుడు ,,
ప్రజల ఆందోళనే ,,
ఫలియించి తీరును. ,,





భూ [illegible] కలిపి